## మంచి వెలుతురు నీయని దీపములు

(విలేఖరి)

మహబూబాబాదు తాలూకా కళ్లు సారా దుకాణముల వేలము నిన్నటిరోజు మదరాసు నిషము ప్రకారము సక్రమముగా జరిగెను. జిల్లా అవ్వల్ తాలూకాదారు, వరంగల్లుజిల్లా అబ్కారి మొహతెమీం, అదేజిల్లా నాయబు మొహతెమీంగారలును, దుస్సం తాలూకాదారును, తహశీల్దారును, ఇతర స్థానికోద్యోగులును సమక్షములోనుండి జరిపించిరి. ప్రతిగ్రామమునుంచియు పటేలు, పట్వారీలును, గౌండ్లవాండ్రును, దేశముఖు దేశపాండ్యాలును, ఇతరులును మొత్తము ౧౫౦౦మంది వచ్చియుండిరి. ప్రతిగ్రామపు పటేలుపట్వారీలకు వచ్చినవారలలో నెవరుగాని మామిలాను తీసికొనకబ్లైన, దానిఏర్పాటుభారము తమపై బడునేమోయని భయపడుచుండిరి. కాని వచ్చినవారలు సంతోషముగా మామిలాలు తీసికొని ఆ భయము తొలగించిరి. అధికారులు రేపు ఇక్కడినుండి ఖమ్మము తాలూకాకు వెళ్లనున్నట్లు తెలిసినది. మానుకోటలో హోటలు సౌకర్యములు లేక వచ్చినవారలకు చాల ఇబ్బందులు జరిగినవి.

### దీపాల ఏర్పాటు

ఈగ్రామములో ౧౦-౧౫రోజులనుండి పెట్రోమాక్సు దీపములు వెలిగించుచున్నారుగాని వాటివెలుతురు మసకమసకగా నున్నది.

### ఆకస్మిక మరణము

క్రొత్తబజారులో ౬-౧౦-౪౬ ఫ. నాడు సాయంకాలము ౫గంటలకు ఒక సాలెవాడు స్మృతితప్పి బావిలో పడి చనిపోయినాడు. స్మృతితప్పి పడుటయు, చనిపోవుటయు ౫ నిమిషములలో జరిగెను.



## గ్రామ సమాచారములు

### సాహెబ్ నగరులో బ్రాడ్ కాస్టింగ్ స్టేషను స్థాపన

సాహెబ్‌నగర్‌లో బ్రాడ్‌కాస్టింగ్‌స్టేషన్ స్థాపనకై ఏర్పాటులు చురుకుగాజరుగుచున్నవి. త్వరలోయంత్రము స్థాపించబడును. ఇటీవలనే నవాబ్ జాలీదర్‌జంగ్ బహదర్‌గారును, నవాబ్ అఖిల్‌జంగ్ బహదర్‌గారును నిజాంప్రభుత్వపు వైర్లెస్‌శాఖాధ్యక్షులగు సయ్యద్ మహబూబలీగారితోకూడపోయి పరిశీలించివచ్చిరని హైద్రాబాదు బులెటిన్ పత్రికకు తెలియుచున్నది.

### ఉమామహేశ్వర గ్రంథాలయము

ఇది మెదకుజిల్లాలోచేరిన శిద్దిపేట తాలూకాలోని శిద్దిపేటగ్రామములో ౧౩౩౨ఫ, లోనో లేక ౧౩౩౩ఫ,లోనో స్థాపితమై ౨ ఏండ్లు సక్రమముగా నిర్వహించబడి, పిమ్మట శిథిలమై, మరల యువసం॥ చైత్రశు॥౧౦ నాడు పునరుద్ధరించబడెను.

ఇపుడీ గ్రంథాలయములో ౭౦౦ గ్రంథములున్నవి. ఆంధ్రపత్రిక, గోలకొండ, ప్రజామిత్ర, యువవాణి, వెంకటేశ్వరసమాచార్, విజయ, ప్రకృతి, భక్తిప్రబోధిని, నవ్యులరాణి—అను తొమ్మిదిపత్రికలు వచ్చుచున్నవి.

గ్రంథాలయముబాడుగ యింటిలోనున్నది సంవత్సరమునకు రూ౨౦౦ల ఆదాయమున్నది. ౫౦రూపాయలనిలువద్రవ్యము సేవింగ్సుబ్యాంకులో నున్నవి.

గ్రంథాలయమునకు విద్యాప్రచారపు కమిటీలు, ఉపన్యాససభలుఅవసరము. ఆదాయము ఎంతోకష్టముమీద ఖర్చునకు సరిపోవుచున్నది.

### మలకలపల్లిలో లోకల్ఫండు పాఠశాల స్థాపన

పాల్వంచసంస్థానములో మందడపల్లి గ్రామములో చాలకాలమునుండి లోకల్ఫండు పాఠశాలయుండెను.అదిఇపుడు అక్కడినుండి ములకలపల్లికి మార్చబడినది. సంస్థానపు విద్యాశాఖయొక్క వాజరుగారు గ్రామమునకువచ్చి గ్రామస్థులను ప్రోత్సహించగా వారలు చందాలువేసికొని పాఠశాలకు అనుకూలమైనఇల్లు, స్థలము దానముచేసిరి. ౨౧-౯-౪౬ఫ.నాడు బూర్గంపాడు పెద్దలలోనొకరును, లోకల్ ఫండుకమిటీసభ్యులుమనగు చంద్రాకృష్ణయ్యచౌదరిగారి అధ్యక్షతన పాఠశాల ప్రారంభోత్సవము బాజాభజంత్రీల సహితముగా జరిగెను. పాఠశాలలో విఘ్నేశ్వరపూజ సరస్వతీపూజ జరిగెను. రంగారావుగారు గ్రంథపఠనావశ్యకతనుగురించి ఉపన్యసించిరి ఫలహారముల తోను, కృతజ్ఞతావందనములలోను సభముగిసెను. ౪౫ మంది పిల్లలవరకును పాఠశాలలో చేరిరి

### నాందేడులో జీవరక్షాప్రచారము

గతవారమునకు పూర్వవారములో భోలోసతి నాందేడుకుపోయియుండి అక్కడి “యస్ పి. సి. ఏ” సంఘముయొక్క ఉద్దేశ్యములను వివరించి జనులను ప్రాణులపైదయగలిగి యుండవలెనని బోధించెను. ప్రజాభిప్రాయమునకుతోడు ప్రభుత్వప్రోత్సాహము కలిసినచో ఈ ఉద్దేశ్యము నెరవేరునని నెను. తాలూకాదారుగారు కృతజ్ఞత ప్రకటించిరి. —బులెటిన్

## శంకరంపేటలో విశ్వబ్రాహ్మణ మతగురువు గారి చాతుర్మాస్యపురికాణా

పెంటదిబ్బలు ముందా? ఇండ్లుముందా?

(పెంటదిబ్బలు తీసివేయగోరిన వారలకు అధికారిప్రశ్న.)

(స్వ. వి.)

శంకరంపేట: ౫-౧౦-౪౬

ఈయూరు పాపన్నపేట సంస్థానమునకు సంబంధించినది. సంస్థానమున్ శ్రీయుత ఆదంఖాన్ తహసీల్దార్ సాహెబుగారు చాలాకాలమునుండి పనిచేయుచుండిరి. వారు సుమారు నెలరోజులనాడు స్వర్గస్థులైరని తెలియుచున్నందులకు ఇచటిజనుల మనంబెంతయు చింతిల్లుచున్నది.

### విశ్వబ్రాహ్మణ మతగురువు

శ్రీవిశ్వబ్రాహ్మణ మతగురువుగారు ఈగ్రామమునకు నేడే సాయంతనము విజయముచేసిరి. మతస్థులు స్వాగత మొసగిరి. భక్తిశ్రద్ధతో గురువుగారికి శుశ్రూషలనొనర్చుచు తీర్థప్రసాదముల స్వీకరించుచున్నారు.ఒకవేళ వీరుచాతుర్మాస్యదీక్షనిటనే గడపుదురేమో తెలియదు.

ఈ ఊరునకు ఒకఫర్లాంగుదూరమునుండి నగరమునుండి నిజాంసాగరునకు పోవురోడ్డుగలదు.ఊరిలో రోడ్డులువేయుటకొరకై కాలతమాత్రము సంవత్సరము నకొకతూరి చేయుటగలదు. బరావర్దు మంజూరిమాత్రము లేదు.గ్రీష్మగ్రీష్మాప్రవేశమైనతోడనే త్రోవలలో నడచుటకష్టముగానుండును. బురదయు, మురికిపెంటలును ఇదివరకే లెక్కకుమిక్కుటముగానుండెను. సంవత్సరముక్రింద శ్రీయుత సింహాచార్యులు స్కూటుమాస్టరుగారు రిపాఠశాలకు మార్చబడియుండిరి ... రైల్వే శుద్ధ్యపు అధికారమునుండెను ... లవని ... లుతీయుటకై కార్రవాయిచేసి. తమేమైనదోయేమో! ఇంతలో ... డి మార్పుచేసినారు.పూర్వపునిక ... చిన సర్కారిపెంటలగుంటలు మా ... క్కువయైనవి ఏండకాలమున యెట్లు ... అముగడుపవచ్చును. కాని ఈకాలమున మనుగడ దుర్వాసనయొకటి, దోమలబాధయొకటి, బావులలోనీరు త్రాగుటకు పనికిరానటులగుట వీటిచే ఇంకాయనేకకష్టాలు గలుగుచున్నవి. కొందరుయువకులు తహసీలుదారుగారితో పై విషయమును మనవిచేయ, పెంటలుముందా, యిండ్లుముందాయని ప్రశ్నించిరట. పెంటలేముందుండెననగా ఇండ్లేతీసివేయుడని ప్రత్యుత్తరమొసంగిరట.

## నిజాం రాష్ట్రము ఫెడరేషనులో చేరు విషయము

ప్రభుత్వమునకు పంపిన విజ్ఞప్తిలో సంతకములు గావించిన ప్రముఖులు

హైదరాబాదు ఫెడరేషనులో చేరు విషయమున కొందరు నగరప్రముఖులు ప్రధానమంత్రిగారికొక విజ్ఞప్తిని పంపినట్లు గతసంచికలో వివరించియుంటిమికదా! ఆవిజ్ఞప్తిపై సంతకములను చేసినవారలలో కొందరు ప్రముఖులైనవారి పేర్లను దిగువ తెల్పుచున్నాము.

౧. నవాబు బహద్దురయారుజంగు బహద్దురు ౨. శ్రీయుత వామన్ నాయకు జాగిర్దారు ౩ మౌల్వీఅబుల్ హసన్ సయ్యదలి, వకీలు హైకోర్టు ౪. శ్రీయుత బి.రామకృష్ణారావుబి.ఏ ఎల్ ఎల్ బి., వకీలుహైకోర్టు, ౫. మౌల్వీఅహమదు మొయిద్దీన్ (రహబరుదక్కను సంపాదకులు) ౬. మౌల్వీఅమనుల్లాసిద్ధిఖి, బ్యారిష్టరు, ౭ మౌల్వీ షాలిబంఖాను. హైకోర్టువకీలు, పురపాలక సంఘుసభ్యులు. ౮. డాక్టరు లతీఫుసయ్యదు ౯. శ్రీయుత కాశీనాథరావువైద్య,ఎం ఏ ఎల్ ఎల్.బి., అడ్వొకేటు ౧౦ మౌల్వీ మీర్ అక్బరలీఖాను బ్యారిష్టరు, ౧౧. శ్రీయుత రామచంద్రనాయకు బ్యారిష్టరు. ౧౨. మౌల్వీమీర్ హసనొద్దీను బి.ఏ,ఎల్ ఎల్ బి , హైకోర్టు వకీలు, ౧౩. శ్రీయుత వినాయకరావుబ్యారిష్టరు. ౧౪. శ్రీయుత గోపాలరావు అడ్వొకేటు, ౧౫. మౌల్వీమహమ్మదు గయాసొద్దీను ఖాన్, జాగీరుదారు, ౧౬. శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి బి.ఏ., బి. ఎల్., ౧౭. మౌల్వీఅబ్దుల్ వాహద్ వలి, హైకోర్టు వకీలు, ౧౮. శ్రీయుత నరసింగరావు, [రయ్యతుపత్రిక, సంపాదకులు] ౧౯. శ్రీయుత ఎం. హనుమంతరావు, [ఆంధ్ర మహాసభ అధ్యక్షులు] ౨౦. శ్రీయుతకృష్ణస్వామి ముదిరాజు, [హైద్రాబాదు పిక్టోరియలు సంపాదకులు] ౨౧. మౌల్వీకలీముద్దీను అన్సారి బి.ఏ., ఎల్ ఎల్.బి., హైకోర్టు వకీలు, ౨౨. శ్రీయుత శ్రీనివాసరావు శర్మ బ్యారిష్టరు.

### ముస్లిం హైకోర్టు న్యాయమూర్తికి సత్కారము

హైద్రాబాదు హైకోర్టులో అదనపు న్యాయమూర్తిగా నియమింపబడిన మౌల్వీ మౌలానా అబ్దులుఖదీరుబాదాయూనిగారిని న్యాయ శాఖ మరియు మతశాఖల అధ్యక్షులగు నవాబులుతుఫుద్దౌలాబహద్దరుగారు సత్కరించి తేనీటి విందొసంగిరి. ఈవిందులో హైకోర్టు న్యాయమూర్తియగు నవాబుఅక్బరుయారుజంగు బహద్దురు, మరియు మౌల్వీమహమ్మదుభాయి (హైకోర్టు కార్యదర్శి)గారును పాల్గొనిరి.

### ఆత్మహత్య

మొహియొద్దీను అను చార్మినార్ యిలాకా తపాలాబంట్రోతు తను వ్రాసిపంపినచిక్కుప్రశ్న జవాబుకు బహుమానము దొరకలేదని ఉరిపోసుకొని మరణించినటుల తెలియుచున్నది.

### ఉస్మానియావిద్యాపీఠ సహకారసంఘపు క్రొత్త సం॥పు ఎన్నికలు

ఈసంవత్సరము ఉస్మానియాపీఠ సహకార సంఘములో ఈదిగువవారిని యెన్నుకొనిరి.

తఖరుల్ హసన్ మరియు అబ్దుల్ సమదు [అధ్యక్షులు],

శ్రీయుత నందాపూరుకరు. మరియు శ్రీయుతగోవిందరావు పావారుగార్లు (కార్యదర్శులు),

మహమ్మదుఉమరు మరియు శ్రీయుత రామచంద్రనాయకుగార్లు [గ్రంథపాలకులు],

మొయొద్దీనుగాజీ, మరియు మీరునిజాబతుఅలీఖాను [సాహెబ్జాదా] గార్లు [కోశాధికారులు]

# స్థానికవార్తలు

### నిర్మాణ శాఖవారి ప్రణాళికలు

నిర్మాణశాఖ మంత్రిగారి అమోదనముపై పర్భణి,మరియు జాతూరుబాటప్రక్కలకు రక్షణకైరాళ్లుపాతుటకు రు౨౩౦౩౮ లుహాలీలు ఖర్చు చేయుటకు అనుమతించబడినటుల తెలియుచున్నది.

### జీవరక్షాబోధ గ్రంధ ప్రచారము

దక్షిణ హైద్రాబాదు జీవరక్షాజ్ఞాన ప్రచారకమండలివారు ౧౫-౭-౩౬ తేదినాడు స్వంత మోటారులారీలో భజనపార్టీని వెంటబెట్టుకొని నగరమున "జీవరక్షా బోధ గ్రంథములు" "అమ్మవారి జాతరసమయమున పశుబలినిషేధకరములగు దృశ్యములతోనున్నవాలుపోస్టరు" "జనులతో మూగపశువుల మొఱ," "జీవదయా భజనావళి" మొదలగు కరపత్రములు పంచిపెట్టుటకు గం ౧౦లకుబయలుదేరి గం౧౨లవరకు సేటిరోజున మొత్తము ౩౨బస్తీలలో సంచారము చేసిరి అమ్మవారిగుళ్ళముందు మేకలను గొఱ్ఱెలను, కోళ్ళను, దున్నపోతులను బలియివ్వరాదని బోధించుచూ స్థానిక ప్రచారకులపై గ్రంథములనిచ్చి పూజావిధానమును మండలికి తెలియజేయ ప్రార్థించిరి. సుమారు ౬ చోట్ల గతభేస్తవారం పూజలుజరిగినవనియు, లాలుదర్వాజ, బాలాగంజి అమ్మవారిగుడిముందుమాత్రము ఒకదున్నపోతు బలి యివ్వబడెననియు మిగిలినతావులలో గొఱ్ఱెలు, కోళ్లు స్వల్పముగా తెగవరకబడెననియు వార్త తెలిపినది. గౌలీగూడ మహంకాళి గుడివద్ద సమాజమువారు స్వయంసేవకులుగా నుండి అమ్మవారి పూజను సాత్వికముగా జరిగించిరి. మరియు పైమండలివారి విన్నపములాలించి తగువిధముల సహాయ్యము ప్రజలు వారికి చేయుచుందురుగాక యని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
క౦॥ స॥ మూర్తి
ప్రచారక్.

### ఉపకార వేతనములు

శంభూదత్తు (మన్సబుదారు) కాలంచేసినందున సర్కారువారు విమర్శనజరిపి కీర్తిశేషుల కుమారుడగు హరంపిదత్తు అనువారికి నెల ౧కి రు౧౨ల చొప్పున మన్సబుయిచ్చుటకు అనుమతించిరి.

సుంకపుశాఖ నాయబునాజంఅగు మౌల్వీ సయ్యదు అహమదలీఖాన్ గారి ఉద్యోగకాల పరిమితి తీరినందున వారిని ఉద్యోగమునుండి విరమింపజేయుచు నెల౧కి రు౬౦౦లు హాలీలు ఉపకారవేతనము యిచ్చుటకు ప్రధాన మంత్రిగారు ఆజ్ఞయిచ్చినటుల తెలియుచున్నది.

సుంకపు శాఖోద్యోగియగు అహమదలి కాలంచేసినందున ఈతనిభార్యయగు అజ్మాబిబేగమునకు నెల౧కి మూడురూపాయిలు ద్రవ్య సహాయము యిచ్చుటకు ఆజ్ఞ అయినది.

### వైద్యకళాశాల విద్యార్థులకు యూనిఫారము నిర్బంధము

ఈసంవత్సరము (౧౩౪౫-౪౬) విద్య ప్రారంభించినప్పటినుండి వైద్య కళాశాలలోని విద్యార్థులను అందరిని తెల్లని యూనిఫారము వేసుకొనవలెనను నిర్బంధము గావించిరి

## నిజాంప్రభుత్వముచే నిషేధింపబడిన గ్రంథములు

"కమ్యూనిస్టు" ప్రకటనల నిషేధము

బ్రిటిషిండియాలోవలె మన నిజాం రాష్ట్రములో "కమ్యూనిస్టుల" ప్రకటనలనునిషేధించు శాసనమేదియు లేనందున నిజాం ప్రభుత్వమువారు కొన్ని ఏర్పాటుల నుచేసి రాజకీయ విషయమునుగూర్చిన పుస్తకము ఏదిగాని, పత్రికగాని కనుపించినచో వాటిని వశపరచుకొనుటకు ఈపోలీసువారికి అధికారమీయబడినది. అట్టి పుస్తకములుగాని, పత్రములుగాని ఎక్కడగాని ఉన్నట్లు అనుమానమున్నచో మేజస్ట్రేటు సోదాచేయుటకు పోలీసువారలకు అనుమతి నీయవచ్చును. ఆజ్ఞ యీదిగువప్రకారము ఉన్నది.

"భారతీయ కార్మికుల విప్లవసంఘము (కమ్యూనిస్టు పార్టీ) యొక్క కేంద్రసంఘము యొక్క ౧౯౩౫ సంగీపు మ్యానిఫెస్టో లేక ప్రకటన."

Manifesto of theCentral Committe of the Revolutiona ry Party of the Indian Working Classes' [communist party] 1935]

(౧) అను ఈపుస్తకము నిజాం రాష్ట్రములో నిషేధింపబడినది. (౨) ఈపుస్తకము యెక్కడ లభించినను జప్తుచేయుటకు పోలీసువారికి హక్కుకలదు. (౩) మేజస్ట్రేటు (అవ్వల్ దర్జా) యొక్కడ ఈపుస్తకము వున్నటుల అనుమానముదోచిన అక్కడ వెంటనే పోలీసు అమీనుకన్న తక్కువ హక్కు వుండనటువంటి వారికి సోదాచేయుటకు అనుమతి ఇవ్వవలెను

* * *

నిజాంప్రభువుగారి ఆజ్ఞప్రకారము ఈదిగువ పుస్తకములను ఈరాష్ట్రములో నిషేధించబడినవి. ఇవి యెక్కడలభించినను ప్రభుత్వమువారు వశపరచుకొనగలరు.

౧ "సంఘగూఢ వువ్యాడ" ఇది ఆత్మారాము బాపూజీకరణ్ ఘోకర్ గారిచే రచింపబడి బొంబాయి రామకృష్ణా ప్రింటింగుప్రెస్సు బొంబాయిలో ముద్రింపబడినది.

౨."హిందూ సమాజదర్శనము" ఇది పూనా వాస్తవ్యులగు ఎల్.బి. భూటీకరుగారిచే రచియింపబడినది.

౩. "హిందూజీవ సంఘటన" ఇది పండిత కృష్ణానందుజీ ప్రయాగ్ గారిచే రచియింపబడి, అగ్రాలో సీతాపల్లిలో రోషన్ ప్రెస్సులో ముద్రించబడి అగ్రాలోనే ప్రేమ పుస్తకాలయమువారిచే ప్రకటింపబడినది

## నిప్పుచల్లార్చు యంత్రము పోలీసువారి వశము చేయుటకై యత్నము

పురపాలక సంఘమువారు ఆలోచనలో బడినారు

నిప్పుచల్లార్చు యంత్రమును పోలీసువారి అధికారముక్రింద నుంచుకొనుటకు పురపాలకశాఖను కోరినందున దీనివిషయమై సంఘసభ్యులు ఆలోచించుచున్నారు. అనుమతియివ్వబడిన తర్వాత ప్రత్యేకముగా పుష్కలముగా, నీరు దొరకునట్లు ఒకస్టేషను యేర్పరచెదరని తెలియుచున్నది.

## వితంతూద్వాహ శాసనమునకు సూబేదారుగారి బ్రేకు

అప్పుడే సనాతనలక్షణపు సవరణకై నోటీసు

[విలేఖరి]
హైద్రాబాదు [దక్కను] ౧౬-౭-౧౯౩౬

౧౬ షహరేవరువాడు జరుగనున్న సభలో వితంతూద్వాహశాసనము చర్చకు రానున్నదికదా. దానివిషయమునపండిత నారాయణరావుగారు బి. ఏ. బి సి. ఇ. (వరంగల్లు సూబేదారు. స్పెషల్ డ్యూటీ మాలుగుజారి] ఒక సవరణను ప్రతిపాదించెదమని ౯ షహరేవరు ౧౩౪౫ ఫసలీనాడు నోటీసు శాసనసభకు పంపినారు. వారి సవరణలోని ప్రధానాంశమేమనగా, వితంతూద్వాహమువలన కలిగిన సంతతికి "ఔరసపుత్రుని" వలెకాక "పౌనర్భవపుత్రు"నిపదవి యుండవలయునని ఈవిషయమున విచారణజరుపుటకై చిత్తుశాసనమును మరల ఉపసంఘము [సెలెక్టుకమిటీ] కు పంపవలయునని వారు ప్రతిపాదించినారు. వీరి ప్రతిపాదన నెగ్గినచో, ఈచిత్తుశాసనము మరల కొన్ని సంవత్సరములవరకు ఆగిపోవగలదు.

వితంతూద్వాహమును ఖానూను ఒప్పుకొనినతరువాత, అట్టివివాహమువలన కలిగిన పుత్రునికెట్టిపదవి యుండవలయునను ప్రశ్నకే తావులేదు. అట్టిపుత్రునకు ఔరసపుత్రునకు, దత్తపుత్రునకు ఎట్టిపదవియుండునో అట్టిపదవియే ఉండవలెను. పండిత నారాయణ[illegible]రివంటివారు యీవిషయము [వితం[illegible] ము] క్రమమైనదేయని తీరా[illegible] ఇట్టియాటంకములు కల్పించుట[illegible] సంప్రదాయమునకు బలముకలి[illegible] జాలరు. ఇట్టిసవరణను ప్రతిపా[illegible] వారు వితంతూద్వాహమును [illegible] ఒప్పుకొన్నవారగుచున్నారు.

### ఆంధ్రమహాసభస్థాయిసంఘ, కార్యకారిణీసంఘ సమావేశములు

౧౧ షహరేవరు ౧౩౪౫ ఫ శుక్రవారమునాడు మధ్యాహ్నము ౩ గంటలకు శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారి గృహమున ఆంధ్రమహాసభా స్థాయిసంఘము, కార్యకారిణీసమావేశమైనది. ఈ క్రిందితీర్మానమును సభ్యులందరు నిలచి అంగీకరించిరి.

"సికింద్రాబాదు వాస్తవ్యులగు, ఆంధ్రోద్యమాభిమానులగు, సంఘ శ్రేయోభిలాషియగు పులిగిళ్ల అంజయ్యగుప్తగారు దివంగతులైనందున సంఘమునకు వాటిల్లిన నష్టమునకు విచారపడుచు వారికుటుంబమునకు, ఈసభవారు తమ హృదయపూర్వకమైన సానుభూతి వందకేయుచున్నారు."

## పరిశ్రమల శాఖాధ్యక్షునికి ముల్కిసనదు ఇచ్చు యధికారము

ప్రధానమంత్రియగు మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దురుగారి ఆజ్ఞప్రకారము. ప్రభుత్వ పారిశ్రామికశాఖలో పనిచేయు ఉద్యోగస్థులకు ముల్కి సడాఫికతునామా పారిశ్రామిక శాఖాధ్యక్షులనుండి లేక కార్యదర్శినుండి తీసుకొనుటకు అనుమతి అయినది.

## కథకుల సమ్మేళనం

కథా సంపుటాల ప్రదర్శనం

వచ్చే ఆగస్టు మొదటివారంలో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయపక్షాన నిలయ మందిరంలో తెనుగుకథకుల సమ్మేళనము జరుప నిశ్చయింపబడింది.

ఇదివరకు ప్రకటింపబడనివి సాంఘిక,సాంఘిక మతవిషయాల విమర్శనా విషాద, హాస్య రసభరితంగా మంచి వ్యవహారిక శైలిలో వ్రాయబడ్డకథలు సమ్మేళనంలో చదువబడుతాయి

కథలు నెమాసాంతమువరకు పైభాషానిలయ కార్యదర్శికి చేరేటట్లు పంపించి కార్యక్రమం ఏర్పరుచడంలో అనుకూలత కలుగజేయ కథకులు ప్రార్థితులు.

ఇదివరకు ప్రకటింపబడిన కథల సంపుటాలు ప్రదర్శనార్థం పంప ప్రకటనకర్తలు, కథకులను కోరుతూవున్నాము.

స్వయంగా దయచేయలేని కథకులు తమ రచన్లు పంపినట్లైతే సభలో సమర్థులచే చదువబడును.

శ్రేదులు నిర్ణయించి ఈ మాసాంతములో ప్రకటిస్తాము. ఈ సమ్మేళనానికి అఖిలాంధ్ర కథకులకందరికి ఆహ్వానము.

కస్తూరి కృష్ణారావు
గౌ. కార్యదర్శి
శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం
సుల్తానుబజారు–హైదరాబాదు దక్కన్

---

## రూ. ౮౦ వేల నపహరించి రమకొనబడు దొంగలఅరెస్టు

హైదరాబాదు నగరరక్షక భటశాఖాధ్యక్షులునగు నవాబు రహమతుయారుజంగు బహద్దురుగారు పదవిని స్వీకరించుటకుముందు కీ॥ శే॥ నవాబు సీక్ దోస్తుఖాన్ గారి బంగ్లాలో సుమారు రూపాయిల దొంగతనము జరిగియుం ఈసాతుయేన్ జాగీర్దుగ్రామము తెలిసివిచారించగా ఈపనిచేసినారలని తేలి నేరస్థులను ఇపుడు తెలియుచున్నది.

---

## సర్కారువారి కిరాయఇండ్లను అమ్ముచిధానము

నగరాభివృద్ధిశాఖవారి ఆలోచన

నగరాభివృద్ధిశాఖచే నిర్మిపము చేయఁబడిన కిరాయయిండ్లను అమ్మివేయతలచినారు. కొనిన వారలనుండి కిరాయవలె నెలలవారీగా రొక్కమువసూలు చేసెదరనియు, ఈవిషయము సంఘసభ్యులు ఆలోచించుచున్నారనియు, ఇప్పుడు ఈపద్ధతి ఆమోదించఁబడినచో ౧౩౪౬ఫ. ప్రారంభమునుండియే అమలుజరుగ గలదనియు తెలియుచున్నది.

---

## శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం

పైసరస్వతీనిలయంలో నూతనముగా చేర్చిన పుస్తకాల పట్టిక.–

అవును, కాలక్షేపము, అప్పుడు } భమిడిపాటి కామేశ్వరరావు

లయోటాల్ స్టాయి
రామమోహన్

తేనెపట్టు
మంచపాక పార్వతీశ్వరశాస్త్రి

బిడ్డలశిక్షణ
గుడిపాటి వేంకటాచలం

నాటకోపన్యాసములు
రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

సుందరి
శివశంకరశాస్త్రి

ఉపాధ్యాయుడు
మునిమాణిక్యం నరసింహారావు

కలువలు
శేషమల్ల కామేశ్వరరావు

కోయిలపాటలు
మంగిపూడి పురుషోత్తమశర్మ

రైతు భజనావళి
రంగనాయకులు

భాస్కరభట్ల కృష్ణారావు
గౌ. గ్రంథపాలకుడు,
6–7–36

---

## సినిమాభవనముల కట్టుబాట్లు

రెసిడెన్సి ప్రభుత్వాజ్ఞ

సికింద్రాబాదులో సినిమాభవనములగురించి ఈక్రిందిప్రకారం నిబంధనలు రెసిడెన్సీప్రభుత్వముచే చేయఁబడినవి

ఎవరైననుసరే సినిమాభవనము కట్టించదలచినయెడల భవనములు, సినిమాకు సంబంధించినవస్తువులు, స్థాపించినమిషన్ మొదలగువాటి నక్షాలతో జిల్లాన్యాయాధికారి (డిస్ట్రిక్టుమేజిస్ట్రేటు)గారివద్ద దరఖాస్తు పెట్టుకొనవలెను. వారు విచారణసల్పి, పరిశీలించి మొత్తముకాగితములను విద్యుచ్ఛక్తి [ఎలక్ట్రికల్] ఇన్స్పెక్టరుగారివద్దకు పంపుదురు. ఇన్స్పెక్టరుగారు కాగితాలను పరిశీలించి తమఅభిప్రాయముతోతిరిగి జిల్లాన్యాయాధికారివద్దకు పంపించవలసియుండును. తర్వాతవారు న్యాయమనితలచిన అనుమతి యొసంగెదరు.

భవనము

సినిమాభవనమును తప్పకళీమా చేయవలసియుండును. భవనమునకు తలుపులు ఎక్కువగా పెట్టించవలెను. ప్రేక్షకులకు తెరువీలుగాయుండవలెను. మొత్తము సినిమాభవనముకొలత ౪౫౦ చదరపుఅడుగులు వుండవలెను తలుపులకు ప్రేక్షకులు కూర్చుండుస్థలమునకు మధ్యగా అడుగులస్థలము ఖాళీగాయుండవలెను. వీట్లమధ్యభాగములో అనగా ప్రేక్షకులరాకపోకలకొరకు ఏర్పడినసందులో ఏవిధమైనవస్తువు అడ్డముగానుంచకూడదు. ఎలక్ట్రికల్ ఇన్స్పెక్టరుగారు సంవత్సరమునకొకతూరి ప్రతిసినిమాభవనమును పరిశీలించవలసియుండును. ఈ ఇన్స్పెక్టరుగారికి మిషన్ మొదలగు సినిమాసంబంధమైనవస్తువులు పరిశీలించుటకు హక్కుకలదు ఏదైన చెడిపోయినట్లు తోచినయెడల ఏదైన వకరిని నియమించి బాగుచేయుటకు ఆజ్ఞనొసంగగలరు.

---

## ఉద్యోగ విషయములు

ఉస్మానియావిద్యాపీఠప్రొఫెసరు గులాం నబీగారు ఉపకారవేతనముపై విలాయతుకు పోనందున, నిజాంకాలేజి ప్రధానోపాధ్యాయ సహాయులు గారు నియమింపబడిరి. ఈపదవిపై ఆ స్థానమున మౌల్వీ (ఫాజలు) గారిని నియోగించిరి. సిటీ కాలేజిలో మరొకరిని నియోగించిరి.

---

మౌలానా మోసిను (ఫాజలు) గారిని ఉస్మానియా విద్యాపీఠ మతశాఖలో తాత్కాలికోపన్యాసకులుగా నియమించిరి.

---

అబ్కారి శాఖాధ్యక్షులవారిఆజ్ఞచే గులాం అహమదుఖాను గారు అబ్కారీ మదద్గారు మోహతెమీం సయ్యదుమహమ్మద్ (శేది) గారి స్థానములో నియోగించఁబడిరి.

---

ఉస్మానియా స్త్రీల విద్యాపీఠమున స్త్రీల విద్యాపీఠమున స్త్రీలకు వ్యాయామక్రీడలు నేర్పు తాత్కాలిక ఉపాధ్యాయినియగు మిస్ సాగారికి జీతము ఎక్కువచేసి ౧–౪–౧౩౪౬ నుండి అమలులోనికి వచ్చుటకు ఆజ్ఞ అయినది. ఈపదవి స్త్రీల సదరు మొహతెమీమాగారి క్రింద వుండుటచే ఉపాధ్యాయినిగారుకూడా సదరు మొహతెమీమాగారి క్రిందనే పని చేయుచుండగలరు.

---

అఫ్జల్ గంజ్ పోలీసు సదరుఅమీన్ అగు ఇఫ్తెఖారల్ హఖుగారి స్థానములో పోలీసుజిల్లాయిన్స్పెక్టరగు సర్దార్ దీన్ ఖాన్ గారిని నియమించినటుల తెలియుచున్నది.

---

ప్రధానమంత్రిగారి ఆజ్ఞచే మిస్టర్ జె. సి. కె. మాధవ్ (ఉస్మానియా వైద్యశాల చింత వైద్యుడు) గారి తాత్కాలిక ఉద్యోగకాలము మరిరెండు సంవత్సరములు హెచ్చించఁబడినటుల తెలియుచున్నది.

---

మౌల్వీ నసుల్లాఖాను (సదరుమహాసలు) గారు దౌరా వెళ్లియుండిరి. నగరము విజయము చేసినటుల తెలియుచున్నది.

# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ శ్రావణ శు॥ ౨

సోమవారము




## చక్రవర్తిగారి అదృష్టము

—:o:—

అష్టమ ఎడ్వర్డు చక్రవర్తిగారిపై తోటాలతో నిండిన ఒక రివాల్వరు విసరబడెనను వార్త ప్రపంచమందు అందరిని విస్మయపరవశులను చేసినది. బ్రిటిషుసామ్రాజ్య తృష్ణాతత్వమును ఎంతమాత్రము సహించని పండితజవహర్లాలుగారికే ఈ వార్త ఆశ్చర్యము కలిగించెను. బ్రిటిషు సామ్రాజ్యమకుటధారికి ఇపుడు స్వతంత్రమైన అధికారములేవియులేవు. స్వతంత్రుడై తాను తలచిన మంచిగాని చెడుగాని చేయుటకు అధికారబలమేకదా మకుటధారులకు అవకాశ మిచ్చునది. బ్రిటిషుప్రభువునకు ఎట్టి అధికారములు లేవని ప్రపంచమంతటికిని తెలిసినదే. బ్రిటిషుపరిపాలనాచక్రమంతయు, బ్రిటిషు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులలో ఎక్కువమందియొక్క విశ్వాసమునకు పాత్రులైన నాయకుల హస్తములలో తిరుగుచున్నదను రహస్యము జగద్విదితము. ప్రభువుయొక్క నిరంకుశత్వముచే ప్రజలస్వాతంత్ర్య సుఖములకు ఎట్టిబాధగాని కలుగకుండ శాసనములును ఆచారములును సంరక్షించుచున్నవి. అంతేగాక, ఈకాలములో బ్రిటిషు ప్రభువు, అనేకులైన ఇతర ప్రభువులవలెగాక, కాలగతిని గ్రహించి, అధికారములకై ఆశపడక చేతనైనమేలును ప్రజలకుచేయుటతో తృప్తిపడు తత్వమునకు తలయొగ్గినాడు. ఇపుడు రివాల్వరు దెబ్బకు గుఱియైన ఎడ్వర్డు చక్రవర్తిగారు తమ ఖర్చులకై ఇవ్వబడుచుండు ద్రవ్యమును తగ్గించుకొనుటకు అంగీకరించియున్నారు. ఇట్టినిరపాయుడును సాధువును నగు చక్రవర్తిపై ఎవరికి కసియుండునో ప్రపంచమందు ఎవరికిని ఊహించుటకు సాధ్యము గాకున్నది. కనుకనే చక్రవర్తిగారిపై రివాల్వరు వేయబడెనను వార్త ఆశ్చర్యసంభ్రాంతులను జేసినది. అదియుగాక రివాల్వరును వేసిన పురుషుడు పోలీసువారిచేత తీసికొనిపోబడినపుడు, అక్కడ ఎన్నిమారులు అడుగబడినను, తనకు చక్రవర్తిగారిని చంపవలెనను ఉద్దేశ్యము ఎంతమాత్రము లేనేలేదనియు, ఆగ్రహమును ప్రకటించుటకుమాత్రమే తానట్లు చేసియుంటినని చెప్పినమాటకూడ ఈ ఆశ్చర్యమునే బలపరచుచున్నది. కాని, అతడు ప్రకటించదలచుకొన్న ఆగ్రహమునకేమికారణమో తెలియుటలేదు. మొత్తముమీద చూడగా ప్రపంచము అతని ఆగ్రహముమాటనుగూడ నమ్మునట్లులేదు. బ్రిటిషు ప్రభువుయొక్క శాసనబద్ధత్వమును నిరపాయత్వమును సాధుత్వమును ఎఱింగియున్న ప్రపంచము, రివాల్వరు వేసినవాడు పిచ్చివాడనిన నమ్మగలదేగాని, ఇతర విధముల తలచుటకు ఆధారములులభించుటలేదు. ఇంతకును దైవానుగ్రహమువలన, ఎడ్వర్డు చక్రవర్తిగారికి గురిపెట్టబడిన రివాల్వరు వారికి ఎట్టి అపాయమును కలిగించక తప్పిపోయినందుకు బ్రిటిషు ప్రజలు సంతోషించుచున్నారు.

## మద్యపాననిషేధ ప్రచారమునకు ఆటంకము

తెలుగులో ఉపన్యాసాలు పోలీసు అమీనుగారికి తెలియవు కాబట్టి అనుమానము

[స్వ వి]

పోయిన గురువారమునాడు నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభా స్థాయిసంఘము యొక్క ప్రచారకులగు శ్రీయుత మంత్రిప్రగడ వేంకటేశ్వరరావుగారు మహబూబు నగరుతాలూకాలో చేరిన బాదేపల్లి గ్రామములో ప్రచారము చేయుటకై పోయియుండినప్పుడు పోలీసు అమీనుగారి వలన మొదటి ఆటంకము ఏర్పడినట్లు తెలియుచున్నది. వేంకటేశ్వరరావుగారు అనాడు ఉదయము గ్రామజనులను కొందరిని ఒకచోట సమావేశపరచి ఇష్టాగోష్ఠి సల్లాపములు గావించిరి. అందు ఆ ఊరివర్తకులు తమ బాగోగులను ఒక కట్టుబాటుగా విమర్శించుకొనుటకై ఒక వర్తకసంఘము నేర్పరచుకొనిన బాగుండును అని వేంకటేశ్వరరావుగారు సూచించిరి. సాయంకాలము మ్యాజిక్ లాంతరు [యక్షిణీదీప చిత్రముల] సహాయముతో మద్యపానమువలని నష్టములనుగూర్చియు, సహకార సంఘ స్థాపనవలని లాభములనుగూర్చియు బోధించదలచి, గ్రామజనులను ఆవేళకు సమావేశము కాగోరిరి. గ్రామస్థులు ఇట్టి సమావేశమునకు ముందుగా పోలీసువారి అనుమతినిపొందిన బాగుండునని సూచించిరి లేనిచో తర్వాత తమకు పోలీసువారలనుండి ఏ ఆక్షేపణలుగాని రావచ్చునని భయపడిరి. అందుపై వేంకటేశ్వరరావుగారు గ్రామస్థులకోరిక ననుసరించి ఆ ప్రాంతమునందు అధికారముగల జెడ్చర్ల పోలీసుఠాణా అమీనుగారివద్ద అనుమతిని సంపాదించుటకై పోయిరి. అమీనుగారితో సాయంకాలము గ్రామస్థులకు మ్యాజిక్ లాంతరుసహాయముతో వర్తకసంఘమును గూర్చియు మద్యపాన నిషేధమునుగూర్చియు చెప్పదలచినట్లు చెప్పి, దానికి అనుమతికోరిరి అమీనుగారు, అ చేయు బోధయంతయు తెలుగులో చేయబడుననియు, అభాష తనకేమియు తెలియదనియు, అందువలన దానిలో ఏమిచెప్పబడునో తనకు విశ్వాసము ఉండజాలదనియు, అందుచేతాను ఎట్టి ఉపన్యాసమునుగాని, ప్రబోధమునుగాని జరుగనీయజాలననియు చెప్పిరి. జవానుకుకూడ ఏదైనప్రచారము జరుగుచో ఆపివేయవలసినదని కూడ ఆజ్ఞనిచ్చిరట. వేంకటేశ్వరరావుగారు, అమీనుగారి ఆజ్ఞకుబద్ధులై, బాదేపల్లినుండి ఆరాత్రి బయలుదేరిపోయిరి.

—

## ధరమ్‌వంత్ హైస్కూలు

క్రిందటివారములో హైస్కూలు విద్యార్థులును, ఉపాధ్యాయులునుగుమికూడి శ్రీ॥ బాలాప్రసాద్ [సూపరింటెండెంటు, టెలిఫోను శాఖ] గారి అకాలమరణమునకు చింతిల్లుచు, విషాద తీర్మానమును గావించి, వారి సహోదరులగు మిస్టర్ జయరామప్రసాద్, బి.ఏ.,ఎల్.ఎల్.బి గారికిపంపిరి జయరామప్రసాద్‌గారు పైపాఠశాల ప్రధానోపాధ్యాయులు. ఈసభలో మిస్టర్ శ్రీనివాసరావుగారు, బాలప్రసాద్ గారి గుణములను, వారి ఔదార్యమును పొగడుచు గొప్పవంశమునకు చెందినఒకగొప్ప ఉద్యోగివలను వీడిపోయెననియు, వారిలోటు మాకందరకును గొప్పనష్టదాయకమేగాక, దుఃఖమునముంచుచున్నదనియు క్లుప్తపుమాటలలో నుడివిరి సభలో పాల్గొన్నవారిలో ప్రొఫెసర్ శివమోహన్‌లాల్‌గారు ముఖ్యులు. విషాద తీర్మానము నిశ్శబ్దముగానుండుసభలో చదివిన తరువాత పాఠశాలకారోజుకు మూసివేయబడెను.

—

## హైదరాబాదు ఆయుర్వేద వైద్యసంఘము అష్టమ సాధారణ సమావేశము

పైసంఘముయొక్క సాధారణసమావేశము ౧౭-౩-౩౬ వ తేదీ శుక్రవారం సాయంత్రం సంఘకార్యాలయమున సంఘాధ్యక్షులగు శ్రీమాన్ కవిరాజ డాక్టరు శివవల్లభగా అధ్యక్షతనుజరిగెను. సభకుసభ్యులేగాక పండితులగు ఇతరవైద్యులుకూడ విచ్చేసిరి అందు కొన్నూరు నివాసులును సరస్వతీ బ్రహ్మచర్యాశ్రమాధ్యక్షులగు గొప్పవైద్యవీరులు పండితశ్రీమాన్ భాగవతాచార్యగారుముఖ్యులు పైపండితయాజమాన్యమున కొన్ని ఓషధీపరిశీలనలుజరిగెను కొన్ని ఓషధులను వారుస్వయముగ ఉత్తరహిందూస్థానమునుండి తీసుకొనివచ్చిరి ఈక్రిందిఓషధుల యొక్క నిజస్వరూపములను రసగుణవీర్య విపాకములను వివరింపబడి ఓషధీప్రదర్శనము గావింపబడెను.

ప్రదర్శింపబడిన ఓషధులు - (మొత్తము ౧౬)

[౧] వృద్ధదారు [౨] దేవదారు [౩] వస [౪] అతివిస [౫] మూలగొండి [౬] గజపిప్పలి [౭] తుంగముస్తలు [౮] రేణకలు [౯] కాంచనారపట్ట [౧౦] నాగకేసరములు [౧౧] సరలదేవదారు [౧౨] నేత్రబాల [౧౩] దేవకాంచనము [౧౪] పిన్నపాల [౧౫] విష్ణుక్రాంత [౧౬] అసారూన్ యూనానీ]

ప్రదర్శనాంతమున సంఘాధ్యక్షులు శ్రీమాన్ పండితభాగవతాచార్య వారికి అనేక కృతజ్ఞతావందనములర్పించిరి. తరువాత నాటికార్యక్రమము ప్రారంభింపబడెను ప్రార్థనానంతరము శ్రీయుత డాక్టరు కె. నరసింహమూర్తి ఎల్. ఎమ్, పిగారు "ఇన్ఫ్లుయెంజా" జ్వరమునుగూర్చి ఆంగ్లేయవైద్యశాస్త్రము ప్రకారముగల భేదములను, లక్షణములను, చికిత్సలను, వాటినిరాకుండ కాపాడగలసాధనములను, నివారణోపాయములను చాలవివరముగ ఉపన్యసించిరి.

తరువాత కార్యదర్శి విద్వాన్ తిరువెంకటాచార్యులుగారు ఆయుర్వేద వైద్యశాస్త్రప్రకారముపైవ్యాధి "విషజన్యప్రతిశ్యాయజవాతశ్లేష్మికజ్వరము" అని తెల్పి వానికుండు లక్షణములను సప్రమాణముగ చూపించిరి. ఆంగ్లాయుర్వేదశాస్త్రముల ప్రకారము లక్షణభేదములను సమన్వయింపచి చాలవిదముగ విమర్శించిరి.

తరువాత అధ్యక్షుల యంత్యోపన్యాసమున రెంటిని సమన్వయింగచుచు మధ్యకలిగిన సందేహములను తీర్చివేసిరి. కార్యదర్శిగారు ఓషధీప్రదర్శకులగు పండితులకును సభ్యులకును వందనములర్పించి సభనుముగించిరి.

(సం) డా. ఆచార్య. (ఉపాధ్యక్షుడు)
(పత్రికటనశాఖాధికారి)

నోటు—: ౨౪-౩-౩౬ శుక్రవారంగ ౩ లకు వతేదీని మరలనవమ సమావేశము "న్యూమోనియా" నుగురించిజరిగను. గనుక వైద్యసోదరుసెల్లరను రాప్రార్థితులు.

—

నిజాంరాష్ట్ర ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తి నవ్వాబ్ మిర్జాయార్‌జంగుబహద్దరుగారు, ఛీఫ్, జస్టిసు, మూడునెలల సెలవుపై ఇంగ్లాండునకువెళ్లి క్రిందటివారము క్షేమముగా హైదరాబాదునకు వాపసు వచ్చినారు.

----

## పురుషుల నేకపత్నీవ్రతులుగ నుంచుటకుశాసనము

గుంటూరుస్త్రీల తీర్మానము

ఈజూలైనెల ౫వ తేదినాడు సాయంత్ర గుంటూరునగరములో స్త్రీల ఒకసభ యొకటిజరిగెను. సుమారు ౩౦౦ మ వచ్చియుండిరి. సభాసమావేశోద్దేశ్యములు ఒక్కభార్యకంటె ఎక్కువమ హమాడకుండునట్లుశాసనము చేయవ అట్లు ద్వితీయవివాహము చేసికొనినపు ను సంఘమునుండి వెలివేయవలెననియు తీర్మానము చేయుటయే ఉపన్యసించిన స్త్రీలు గుంటూరు శారదానికేతన కార్యదర్శిని ఉన్నవలక్ష్మీబాయమ్మ ప్రభృతులు పురుషునిచే వదలబడిన స్త్రీ ఆటువిధవగాక ఇటుకన్యగాక, విధవవలె పురుషుని ఆస్తిలో కొంతభాగమునైనను జీవనాధారముగ పొందలేక నానావస్థల పాలగుచుండుటవలన ఈశాసనము ఒకటిఅవసరమగుచున్నదనిరి. తీర్మానము ఏకగ్రీవముగా నామోదించబడెను. మొదటిభార్యను వదలి రెండవభార్యను వివాహమాడు పద్ధతిని ఇండియాప్రభుత్వమువారేగాక రాష్ట్రప్రభుత్వములును, దేశీయసంస్థానప్రభుత్వములుకూడ నిషేధించవలెనని తీర్మానములో కోరబడెను ఈతీర్మానము అఖిలభారత మహిళాసభలో ప్రవేశపెట్టబడునట.

* * *

౧౩ జూలైనాటి ఆంధ్రపత్రికలో శ్రీమతి చందవవోలు పద్మావతీబాయిగారు గుంటూరుయువతులు తమతీర్మానము నుపసంహరించుకొనుట మంచిదని సూచించుచు, భర్తచేవిడువబడిన స్త్రీ తనమనోవృత్తిని సివిల్‌ప్రొసీజర్ కోడుప్రకారము సంపాదించు కొనవచ్చుననియు, దుర్మార్గముగా స్త్రీని పురుషుడువదలినచో ఇండియన్ పీనల్‌కోడులో కావలసినన్ని చట్టములు సంరక్షణగనున్నవనియు, కొబట్టివేరుగ ఒకక్రొత్తచట్టము అవసరమనియు చెప్పుచున్నారు. పత్రికగల ఇంకొకఆక్షేపణ "భర్తలను ఇట్టిచట్టముల క్రింద కారాగారములకు బంపుట, ఉరిశిక్ష యొసగుట అనుకరణశిక్షయే చట్టశాసనమగునెడల, భర్తల కఠినశిక్షనందజేయు" వారలు "నిర్భాగ్యపు" స్త్రీలుఅనునది.

—

# స్త్రీజన ప్రబోధము

## ఆంధ్ర విద్యార్థినికి సహాయము

[ఒక విద్యాభిమాని]

శ్రీ లక్ష్మీబాయి ఘటకేశ్వరము (N.S Ry.) వాస్తవ్యురాలు, వితంతువు: సుమారు ఏనిమిది వత్సరముల క్రిందట విద్యార్జనమునకై గుంటూరులోని శ్రీ శారదా నికేతనమునకు వెళ్లియుండెను. అచ్చట ఉదారహృదయులగు ఉన్నవదంపతుల ఆశ్రయమున జదివి "సాహితీ" పరీక్షయందుత్తీర్ణయై "విదుషీ" పరీక్షకై కొంతకాలము విద్యాభ్యాసించెను. అటుతరువాత, చిత్రలేఖనముపై అభిరుచియుండినందున దానిలో వృద్ధిగాంచుటకై ఒక ఉదారాశయుని వలన, విద్యార్థి వేతనమును పొంది, మద్రాసులో నున్న గవర్నమెంటు స్కూల్ ఆఫ్ ఆర్ట్సు అండు క్రాఫ్ట్సు (Govt School of Arts and Crafts)లో ప్రవేశించి రెండుసంవత్సరముల కోర్సు పూర్తి చేసికొనిన పిమ్మట మూడవ సంవత్సరమునకు హైదరాబాదులో ప్రభుత్వమువారి యొక్కయు, దేశసోదరుల యొక్కయు సహాయము వేడెను.

ఈమె ఈసందర్భమున నాజిం తాలీమాతు గారిని, విద్యామంత్రిగారిని, పారిశ్రామిక శాఖా కార్యదర్శిగారిని దర్శించి దరఖాస్తులు ఒకవిద్యార్థినీవేతనము నిప్పించవలసిన కోరుచు దాఖలుచేసెను. కాని సంవత్సరకాలమైనను ఫలముకలుగలేదు. మహోదారులగు రాజా బహద్దరు వేంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారు కొంత ద్రవ్యసహాయము నొనర్చిరి. శ్రీరంగ అతఉన్న వసుబ్బారావుగారు ఉదారముగ ప్రతి నెల వ్యయములు దాదాపు సంవత్సరమువరకు సహాయము చేసిరి. విఖ్యాతులగు మునగాల జమీందారు రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారు మదరాసులోని తమ దివ్యభవనమున నొక గదినొసగి కొంతకాలము అమూల్యసహాయ మొనర్చియుండిరి. ఎట్లెట్లో మూడవ సంవత్సరము కోర్సు పూర్తియైనది!

ఇక నాల్గవ సంవత్సరము జరుగవలసి యుండెను. దీనికై ఈవిద్యార్థిని మూల విద్యామంత్రి మొదలగువారి కొరకు దర్శనము విద్యార్థినీ వేతనమునకై చేసెను. ఎండకాలపు సెలవులు పూర్తియైనందున మదరాసులోని పాఠశాల తెరువబడినది. త్వరగా వెళ్లవలసి యుండెను మూడవ సంవత్సరము సహాయముచేసిన దాతలను మరల బాధించుట సమంజసముగాగాని, ఫలకారిగా గాని లేనందున, ఇటీవల నీమె, మా, సయ్యదు మెహిదీ నా॥ బాబె సాలుకూమతు గారి యొక్కయు, వారి బేగంసాహెబా యొక్కయు దర్శనము చేయుగా వారిరువురును సమకుగల గాఢమగు స్త్రీవిద్యాభిమానముచే ప్రేరితులై ఉదారభావోపేతులును, విద్యాపోషకులునునగు మన ప్రధానమంత్రిగారగు మహారాజా సర్ కిషన్ ప్రసాదు గారి దర్శనమగునట్లు ఏర్పాటుచేసిరి. శ్రీ మహారాజు గారు ఈమె వ్రాసిన చిత్తరువులను చూచి చాల ఆనందించిరి. అందులో "నిరీక్షణ" "పర్యావసు" అను రెండింటిని, మరియొక మూడవదానిని చూచి మెచ్చుకొని తమకిమ్మని కోరిరి. లక్ష్మీబాయిగారు సంతోషపూర్వకముగాను, కృతజ్ఞతాసూచకముగాను గాని వి శ్రీప్రభు మాత్యుల కర్పించిరి. శ్రీ మెయు మహారాజు విచారించి సంగతులను తెలిసికొని, నాలుగవ సంవత్సరము మాసిక సహాయము ఆమెకు బహుమానముగా నొసంగిరి. మహారాజా బహద్దరు గారి యౌదార్యము, వారి కళాపోషణమును, చాటుచున్నది!

లక్ష్మీబాయిగారి చిత్రములు ఇంకను ఎన్నియో కలవు. ఆమెకు నాల్గవ వత్సరము చదువు పూర్తి చేయుటకు ధనసహాయము కావలయున్నది. ఆమె వద్ది చిత్తరువులు కొనిన వారు ఉదారులగువారు ప్రోత్సహించిన నియ్యవచ్చును. లేనిచో ధనసహాయము చేసి యొకస్త్రీయొక్క కళోపాసనను ప్రోత్సహించవచ్చును. చిత్రలేఖనమునకై నిజాము రాష్ట్రములోని యొక విద్యార్థిని, అందును వితంతువు మద్రాసువంటి దూరస్థలమునకుపోయి, అచ్చటి ప్రభుత్వ చిత్రకళాశాలలో మూడువత్సరములు పూర్తి చేసి నాల్గవవత్సరపు కోర్సుకై యత్నించుట చాల ఆశ్చర్యకరవిషయము మన రాష్ట్రములోని ఆంధ్రుల చేతను, అందును ముఖ్యముగా యాదిక సంఘములచేతను (ఈమె ఈసంఘమునకు సంబంధించినదే) ఇట్టి విద్యార్థిని ప్రోత్సహింపదగినది.

"భారతి, గృహలక్ష్మి" యను మాసపత్రికలలో ఈమె చిత్రించిన పటములు వచ్చియున్నవి. ఇటీవల కోకనాడలో జరిగిన చిత్రకళా ప్రదర్శనమునందు ఈమె శిల్పమునకు స్త్రీల చిత్రలేఖనములపోటీలో యువవదిరూపాయల బహుమానమువచ్చినది. కనుక లక్ష్మీబాయిగారు సర్వవిధముల కళయందు వృద్ధిమార్గోన్ముఖులు. వీరు ముందు ఈరాష్ట్రములోని మహిళాలోకమునకు సేవజేయు నుద్దేశముగలవారు. దేశీయపోషకులు, ముఖ్యముగా నాంధ్రులు ఈయంశము ననుగ్రహించి ఈమెకు తోడ్పడుట ఉచితము.

నిజాము ప్రభుత్వ విద్యాశాఖవారు ఇట్టి విద్యార్థినిని ఆదరించుట న్యాయము. ఎందరో విద్యార్థులు, విద్యార్థినులు పరదేశమునందు ఏంకొలది చదువుచు ఇక్కడి విద్యాశాఖనుండి విద్యార్థివేతనముల పొందుచున్నారు అట్టిస్థితిలో ఇట్టివిద్యార్థినికి ఒకవసీఫా దొరకుట గొప్పకాదు. తాలీమాతు నాజంసా॥ గారు తమవద్దనున్న ఈమెదరఖాస్తులపైన కరుణాదృష్టి ప్రసరించెదరా? ఉదారస్వభావులగు నవాబ్ మెహదియార్జంగు బహద్దరు గారు విద్యాశాఖనీవిషయమున మద్బోధించెదరా? చూతము గాక!



రోషానికై ౨౩ మైళ్లు పరుగెత్తిన స్త్రీ

శైలెట్ ఫీర్సి అనుకన్య విండ్సరునుండి లండనుకు (౨౩ మైళ్లదూరము) పరుగెత్తుపోటీలో ౭౨ మంది పురుషులలోగూడ పాల్గొనుటకు ఎవరును అంగీకరించరైరి. స్త్రీలు అంతే చేతగానివారలాఅని ఆమెకు రోషమువచ్చెను. అందుచేత ఆమె పురుషులు పరుగెత్తుట కారంభించుటకు ముందుగానే విండ్సరునుండి బయలుదేరి ౪ గం. ౨౫ ని లలో లండను చేరెను. అంత పరుగెత్తినను బడలిక రాలేదు. అందరికంటె మొదట గెలిచిన పురుషుడు ఏ. జె. నారిస్ అనునతడు ౨ గం. ౩౫ ని. లలో లండను చేరెను దీనివల్ల ఆమెకు ఖేదమును కలుగలేదు. ఏలనన గా తాను పురుషులతో పోటీచేసియుండలేదనియు, స్త్రీలు అంతతక్కువవారలు కారని చూపించుటకుమాత్రమే తాను పరుగెత్తియుంటిననియు ఆమె చెప్పెను.

### స్త్రీల ఆరోగ్య సౌభాగ్యసంఘము

ఒలింపియాలో ఇటీవల స్త్రీలఆరోగ్యసౌభాగ్యసంఘముయొక్క వార్షికప్రదర్శనములో ౫ వేలమంది స్త్రీలు, అందరును ఒకటేతరమువారుకాక మూడు వేర్వేరు తరములను చెందినవారలు బాలికలు మొదలుకొని వృద్ధులవరకు అనేకవేలమంది ప్రేక్షకులయెదుట ఆరోగ్యము, సౌభాగ్యము [అనగా సౌందర్యము] గల స్త్రీలు ఎట్లుందురో తమశరీరములను నిదర్శనములుగ ప్రదర్శించిచూపిరి ౭౧ ఏండ్ల వయస్సుగల ప్రునెల్లాస్టాక్ అను ఈసంఘమునకు అధ్యక్షురాలు. ఈమెతల్లి బేగట్ స్టాక్ అనునామెయే ఈసంఘమును స్థాపించియుండెను ఆమె ౧౯౩౫ లో మరణించెను. ఈసంఘమును ౬ ఏండ్లక్రిందట స్థాపించినపుడు అందు ౧౬ మంది సభ్యురాండ్రుండిరి. ఇపుడు ౯౨౦౦౦ మంది సభ్యురాండ్రుగలరు.

బెంగాలురాష్ట్రములో ఈసంవత్సరము కాటకము బాధ ఏర్పడినది. అందుచే కట్టుకొనుటకు ఒంటినిండుగ సరిపోవుచీరెలు లేక బాధపడుచున్న స్త్రీలకై ౧౫౦౦౦ చీరెలనైనను జమ చేయుటకు శ్రీమతి అమృతికౌరుగారు బెంగాలురాష్ట్రమందును, ఇతరరాష్ట్రములందును పెద్దపట్టణములలో సంచారము చేయుచున్నారు.





### అఖిలభారత మహిళాసభ అర్థవర్ష సమావేశము

ఇది వాల్తేరులో ఈజూలై ౨౩ తేదినాడు ప్రారంభమై ౨౫వ తేదీవరకు జరుగుననియు, జిల్లాల కార్యదర్శినులను, కార్యకారిణీ సంఘ సభ్యురాండ్రును ఈసభకు రావలెననియును, ప్రేక్షకురాండ్రుగా మాత్రము రాదలచినవారును రావచ్చుననియు స్థాయిసంఘ కార్యదర్శిని మ. కమలమ్మగారు ప్రకటించుచున్నారు.

### ఎన్నికలలో స్త్రీల చురుకుదనము

ఇపుడు బ్రిటిషిండియాలో నూతన రాజ్యాంగములో ఓటు హక్కుగలవారు పేర్లను రిజిస్టరు చెయుచున్నారుగదా. ఇందులో ప్రతి ఏడుగురు పురుషులకు ఒక్క స్త్రీయైనను ఓటుహక్కుగలదిగా రిజిస్టరుఅగునని బ్రిటిషు పార్లమెంటువారు ఊహించియుండిరి. ఇపుడు ఇంతవరకు మదరాసురాష్ట్రములో రిజిస్టరుచేయబడిన స్త్రీలసంఖ్యనుబట్టిచూడ అంతకంటె ఎక్కువమంది స్త్రీలే ఓటర్లైరి పురుషులు ౪౩౧౯౭౭౧ మందియు, స్త్రీలు ౧౪౦౭౨౯౯ మందియు ఓటర్లైరి. ఈవిధముగ మదరాసు రాష్ట్రములో ప్రెలిమినరీ ఓటర్ల జాబితా తయారైనది.

## హాలీవుడ్డు అందగత్తెలలో రెండవది

గ్రేటాగార్బో

ఆమెరికా సుప్రసిద్ధుడు కళానిపుణుడు జేమ్సుమాంట్‌గ్గామరీగారు హాలీవుడ్డులో నుండు సినిమానటులలో ఈక్రింది అయిదుగురును చాలమంచి అందగత్తెలని అభిప్రాయ మిచ్చినాడు:—

౧. మాడలీన్ కెరాల్ [బ్రిటన్] గ్రేటాగార్బొ [స్వీడన్ దేశము] ౩. మార్లీన్ డయిట్రీచు [జర్మనీ] ౪. జీన్ హార్లో [అమెరికా సంయుక్త రాష్ట్రములు] ౫. డోలోరెస్ డెల్ రియో [మెక్సికో]

ఇకదేనివిచేటి వీరలను అందగత్తెలని నిర్ధారణచేసిరో చెప్పుచు, మాకేమ్సుగారు వీరలలో పైకికనబడు అందమే తనకు ప్రధానము కాదనియు, తలపుర్రె ఎముకలనిర్మాణముకూడ తనకు ప్రధానమనియు చెప్పిరి. అందులో గార్బొతలపుర్రె చాల అందమైనదని చెప్పిరి.

---

### విద్యనేర్పుటలో ఫిలిములు ఉపకరణములగుట

లండనులో "సామ్రాజ్యపుఫిలిం గ్రంథాలయము" (యంపైర్ ఫిలిం లైబ్రరీ) గలదు. అక్కడనుండి అనేకము లైనఫిలిములు బళ్లలో ఉపాధ్యాయులు చెప్పు పాఠములను విద్యార్థులకు బోధపరించుటకై పంపబడుచుండును.

---

## అమెరికా ఫిలిం పరిశ్రమ యజమానులకు, నటీనటులకు జోస్యము పిచ్చి

ఇప్పుడు అమెరికాదేశములోని హాలీవుడ్డులో ఫిలిముల డైరెక్టరులకును, నటీనటులకును జోస్యముపిచ్చి ఎక్కువైనది. మంచిరోజు చూచుకొననిది నటీనటులు ఫిలిం యజమానులతో ఒడంబడిక నేర్పరచుకొనరు. డైరెక్టర్లు శుభముహూర్తములో తమపని ప్రారంభింతురు. తరువాత తయారైనఫిలిం విడుదలకుకూడ మంచిరోజు ఏర్పరచుకొందురు. స్టూడియోలకుగూడ జాతకములు కట్టబడుచున్నవి. నటీనటులు తమజాతకములకు సరిపోవు జాతకములుగల స్టూడియోలోనే చేరుచున్నారు.

ఇందుచే జోస్యము చెప్పువాగల పంటపండినది. వారలలో ఒకడు చీరోఅనులండనునగరవాస్తవ్యుడు [రాయల్ జాగ్రఫికల్ సొసైటీయొక్క ఫెలో] తనవద్దకుజోస్యమునకై వచ్చుగుంపును సమాళించుకొనలేక ఒక్కొక్కరికి ౧౦ పౌనులు (సుమారు రూ ౨౦౦లు) ఫీజువిధించుచున్నను గుంపు అతనిని వదలుటలేదు.

విమర్శలచేతను, వాదములచేతను మాస పత్రికలచేతను, ఉపన్యాసములచేతను భారత దేశపు ఫిలింపరిశ్రమను అభివృద్ధిదశకు తెచ్చు నుద్దేశ్యముతో అమృతసరులో ఫిలింప్రేక్షకసంఘము (Picturegoers' Association) ఏర్పడినది.

---

రుస్తుంజీ పి. మాస్టర్ అనుకేతడు భారతదేశమునుంచి అమెరికాకుపోయి అక్కడ హాలీవుడ్డులో ఫిలింపరిశ్రమకుసంబంధించిన సాంకేతికవిషయములయందు ప్రావీణ్యము సంపాదించి తిరిగి బొంబాయిచేరుకొనినాడు. అమెరికాలో అతడు అనేకములైన డిప్లొమాలను, పతకములను సంపాదించినాడు అతడులండనులో "రాయలుసొసైటీఆఫ్ ఆర్ట్సు" యొక్క ఫెలోమాత్రమే గాక "రాయలుఫొటోగ్రాఫికుసొసైటీ" యొక్క అసోసియేటు. వారమురోజుల క్రిందట బొంబాయికి తిరిగివచ్చినపుడు భారతదేశపుఫిలిములలో సాంకేతికలోపములు గలవనియు, వాటినిసరిచేయుటకై తాను యత్నించగలవనియు చెప్పిరి.

---

### క్రొత్త నటీనటులను తీసికొనని లోపము

యన్. శ్రీనివాస్ యం.ఏ.గారి సంపాదకత్వమున నిర్వహించబడుచున్న "టాకౌటోన్" (Talk a Tone) అను పత్రికయొక్క సంవత్సర సంచికలో ఒకవ్యాసములో ఇపుడుభారతదేశపు ఫిలింపరిశ్రమలలోని ఒక లోపము క్రొత్తనటీనటులను గ్రహించకపోవుటేయని చెప్పబడినది. పాశ్చాత్యదేశములలో అందమున్నవారినిమాత్రమే గ్రహించి తక్కినవారి నందరిని వదలుటలేదు. నాట్యకళయందు అభిరుచియుండి, కొంత కంఠస్వరముబాగుపడి సభాకంపము లేనివారలను అనేకులను సిద్ధముగానుంచుకొందురట, వారికి ఒక ఏటాది, రెండేండ్లు తక్షకారము వారికి శిక్షణనిప్పించి సమర్థులను చేసికొందురట. ఈ ప్రకారముగనే భారతీయఫిలిం యజమానులను చేయదగునని సూచించబడినది.

---

## విశేషములు

### కల్లుత్రాగియున్న మోటారుడ్రైవరుకు లైసెన్సుపోవుట

వర్కింగ్ అనుపట్టణమునందు ఒకమోటారుడ్రైవరు తప్పత్రాగి ఒపిలు తెలియక యుండగా, అతనిని అధికారులు పట్టుకొని, కొన్నిమాటలు చెప్పిపలుకకమనిరి వాడు మొదటిమాట సరిగా చెప్పను లేదుకొని తరువాత మాటలనుసరిగాపలికెను. అతనికి ౧౫ పౌనుల జుర్మానావిధించి ఒక సంవత్సరమువరకు అతనిమోటారు లైసెన్సును రద్దుచేసిరి.

---

### సముద్రములో చేపలగుంపును రేడియోతో కనిపెట్టుట

సముద్రముయొక్క లోతునేగాక సముద్రములో ఎంతలోతున చేపలగు పులెగుచున్నవి, అగుంపును, అలోతునుగుర్తించుటకు అనువైన ఒకరేడియోయంత్రము కనుగొనబడినది. ఈరేడియోయంత్రమునుండి వెలుతురు కిరణము నీటి అడుగునకు ప్రసరించును. అక్కడినుండి అదిమరల ఓడపైకిప్రతిఫలించును ఈ ప్రతిబింబముచే నీటిఅడుగున చేపలగుంపు౦డు సమాచారమున్ను, అదిఎంతలోతునవుండునదియు కనుగొనబడుచున్నది.

---

### పాముకాటుకొరికిన ౧౭ నెలలశిశువు

అటలాంటాలో జాన్ బోన్ అను ౧౭ నెలలశిశువు దొడ్డిలో ఆడుకొనుచు ఒక పామును కొరికెను. అతనిని ఆసుపత్రికి తీసికొనిపోగా అతనికి విషమెక్కనట్లు తేలెను పాముమాత్రము. చచ్చియుండెను.

---

### పుస్తకముల మరకలు పోగొట్టువిధము

పుస్తకములకు మరకలేమైనను అయియున్నచో వాటిని పోగొట్టుటకు వాటిపై గ్రీజుపీముసున్నముపోడి చదునుగాచల్లిఅనేకగంటలకాలముఉంచి బ్లాటింగుతోనొత్తి, ఇస్త్రీచేసి బ్రష్షుతోతుడిచివేసినచో పోగును. సిరామరకలను పోగొట్టుటకు ఒకగాజుకడ్డీని ఆక్సాలిక్ ఆసిడ్‌లో ముంచిపూయవలెను.

---



## ౫౬ ఏండ్లుభోజనము లేకున్నను పటుత్వము హెచ్చుట

ఒంటూరా వాస్తవ్యురాలగు గిరిబాలాదేవి ౧౨ వఏట పెండ్లిఅయ్యెను తర్వాత కొన్నినెలలలో వైధవ్యమనుభవించెను. అదిమొదలుకొని ఆమెను ఎప్పుడు చింతవిచారము బాధించుచుండెను. వైద్యులేమియు చేయలేకపోయిరి. అప్పుడామె ఇంటివారలు సంచారముచేయుచు వచ్చిన ఒకయోగిని పిలిపించిరి ఆబాలిక యోగవిద్యనునేర్చుకొనెను. భోజనములేకుండ జీవించుటకు శక్తినియ్యగలవిద్యను ఉపదేశముపొందెను. అదిమొదలుకొని ఆహారముమానివేసి కావలసినన్ని మంచినీటితో కొద్దిగా ఉప్పుమాత్రము కలుపుకొని త్రాగుచు విస్తారముగా పరిశుభ్రమైనగాలి, మంచిఎండ పడుచోట్లనిలుచుచు కాలముగడుపుచుండెను. ఇట్లు యోగవిద్యనభ్యసించి నదిమొదలు ఇంతవరకు ఆమెకు రోగముతాలేదట ఆమెకు ఆకలిగాని అలసటగానిలేదు. ఎంతకష్టమైన పనియైనను చేయగలదు. ప్రతిరోజు ఒకగంటకాలము ధ్యానముచేయును. ఇపుడామెకు ౬౮ ఏండ్లు వచ్చినను పటుత్వము, ముఖవర్చస్సుగల్గియు పతివలెనున్నదని సండేయక్స్ప్రెస్ పత్రికయొక్క విశేషపత్రికలో వ్రాసినాడు.

---

## కూరగాయల చెట్లనుండి ఇప్పటికంటె ౨౦ రెట్లఫలితము వచ్చుమార్గము

కాలిఫోర్నియా విద్యాపీఠములో వృక్షశాస్త్రపరిశోధకుడగు డాక్టర్ డబ్ల్యు యఫ్. జెరికేనిగారు కూరగాయచెట్లనుండి ఇప్పటికంటె ౨౦ రెట్లఫలితము వచ్చుపద్ధతి కనిపెట్టినారు. ఈవిధానములో చెట్లను భూమిలో మొలవేయవక్కరలేదు ఏదోఒకరసాయనము వారికి తెలిసినదిగలదు, అదికలిపిననీటిలో వాటిని మొలవేతురు. ఆరసాయనపదార్థమే చెట్లవ్రేళ్ల ద్వారాఆహారమునొసంగును. జెరికేనిగారు ఈవిధానమును కాలిఫోర్నియాలో కొందరు తోటమాలులకు పరీక్షార్థమై తెలిపించిరి. ఇతరదేశములకు ఈవిధానము ఎంతమాత్రము పనివచ్చునో చూచుటకై బ్రిటనుదేశములోని కొందరు తోటమాలులకుగూడ తెలిపినారు అన్నిదేశములకును ఇదిపనికివచ్చుచో ఇక కూరగాయల వ్యాపారులు అక్కరలేక ఎంతచిన్నదొడ్డిలోనైనను కావలసినన్ని కూరగాయలను పండించుకొనవచ్చును.

---

# నవనాగరిక పాశ్చాత్య సాంఘిక ప్రపంచము

## సెలవు తీసికొనినందుకు శిక్ష

బ్రిస్టల్ నగరములో ఒకపాదరక్షల [చెప్పుల] దుకాణపుమేనేజరుపై అతడు వారాంత దినమున మధ్యాహ్నము ౧౪ గంటకే దుకాణము మూయవలసియుండగా ౫౦ ౧౫ ని లవేళ్ల దుకాణపుకిటికీని బాగుచేయుచు, దుకాణము తెరచియుంచెననియు, సెలవు తీసుకొన లేదనియు మేజిస్ట్రేటువద్ద ఫిర్యాదు చేయబడెను. నిందితుడు [ముల్జిం] సమాధానము చెప్పుచు, తనకు సెలవు అక్కరలేకుండెననియు, తాను అప్పుడే క్రొత్తగా ఉద్యోగమునందు చేరియుండెననియు చెప్పెను. మేజస్ట్రేటు అతని సమాధానమును లెక్కపెట్టక త్రోసివేసి "దుకాణముల శాసనము"ను ఉల్లంఘించినందులకు ఐదు షిలింగుల జుర్మానా విధించెను.

## నవ్వుట శాంతిభంగాపరాధ మగునా?

అలోవాసమీపమున డావెర్ నగర పట్టణ శాస్త్రవ్యశాలకు జెన్సీరాంసేమాగ్డొనాల్డు సతి ఒక పురుషుని అతనిభార్యనుచూచి నవ్వుటయేగాక, మేకవలెఅరిచి వారలను బెదరుకొనునట్లు చేసెనని ఒక నేరము న్యాయస్థానమున విచారణకువచ్చెను. నవ్విన స్త్రీయొక్క వకీలు మేకవలెఅరచినట్లు రుజువుచేయుటఅసాధ్యముకానున్నను కష్టమనియు, ఎవనినిలేక ఎవతెనుజూచి నిందితురాలునవ్వెనో వారలలో నెవరుబిప్పుకొన్నను, నవ్వుట అపరాధము కాదనియు వాదించెను. న్యాయాధికారి తీర్పుచెప్పుచు ఏపనిగాని చేసిన తీరునుబట్టి అది శాంతి భంగ కరమగునదికానిది నిర్ణయించబడదగుననిరి. శాన్సీసతి నేరము చేయునట్లు తీర్పుచెప్పి, అభియోగమును త్రోసివేసిరి.

## భార్యపేరకట్టిన భీమామొత్తమునాశించి భార్యనుచంపుట

లాస్ ఏంజెల్సునగరములోఆనేకులనుఆకర్షించిన ఒక హత్యాభియోగములో ప్రాసిక్యూటరు చెప్పినదేమనగా రాబర్టుజేమ్సు అను నతడు తనభార్యపేరకట్టిన ౪౦౦౦పౌండ్ల భీమా మొత్తమునుఆశించి. భార్యను చంపివేయదలచి, ఆమె కాళ్లను పాములతో నిండిన ఒకపెట్టెలోనికి దూర్చెనట. ఆపెట్టెను చార్లస్ హోప్ అనునతడు ఆపెట్టెతెచ్చియిచ్చెను. మొదటజేమ్సు ఆమెను [illegible] పెట్టి [illegible] పెదవులకు తెరచుటకువీలు కాకుండ [illegible] స్త్రీతో అతికించి కాళ్లుచేతులుకట్టి [illegible] ఆపై ఆకాళ్లను పాముల [illegible] దూర్చెను. దూర్చినప్పుడు ఒకపాము [illegible] రుకొని దూరముగ పోయెను కొన్ని గంటల [illegible] తర్వాత జేమ్సు తనభార్యపరలోకగతురాలైనను రాలేదనియు, అందుచే నీళ్లలో [illegible] యు చెప్పెనట.

## జబుబిందిపోదని కాస్త్రీ భార్యను [illegible]

షికాగో పట్టణమున [illegible] తనభార్య తనజాబును చింపెనని కోర్టు [illegible] ఆభార్యను వదలిపెట్టుటకు న్యాయస్థానమువారి అనుమతికోరెను. అతని భార్య భర్త చెప్పినది సర్వాబద్ధమనుచు. తనభర్త ప్రతిసెలయు క్రమముదప్పక తనను రెండుసార్లు కొట్టుచుండుటచే తమ సంబంధమిాగంతకివచ్చెనని చెప్పెను.

## ఉపాధ్యాయుల యిండ్లలో దుర్నీతిచే వారల ఉద్యోగము ఊడదు

### కేంబ్రిడ్జి విశ్వవిద్యాపీఠపు తీర్మానము

కేంబ్రిడ్జి విశ్వవిద్యాపీఠము యొక్క అధికారమునకులోబడి పనిచేయు ఉపాధ్యాయుల యొక్కయు, ఇతరోద్యోగుల యొక్క ఇండ్లలో నీతివర్తనము సరిగా నుండలేదను కారణముచే వారలను తొలగించవలసిన అవసరము లేదని విశ్వవిద్యాపీఠమువారు తీర్మానించినారట. వారి ఇండ్లలో నీతికిని, వారలు బళ్లలో చేయుపనికిని సంబంధమేలేదని విద్యాపీఠమువారు నిశ్చయించినారు

## వినోద మంజరి

౧౧

ఒక లావాటిఆడమనిషి జట్కా-దిగి కిరాయి డబ్బులు సరిగా పావులా బండివాని చేతులో పెట్టెను. వానికేమీ ఇనాము ఇవ్వలేదు. ఏమో రహస్యము చెప్పువానివలె వాడు ఆమెవైపువంగి అతివినయంగా,

"అమ్మా! మీరు దయచేసి ఇంకోమార్గాన పొండి. గుఱ్ఱము పక్కగాపోకండి" అని పలికెను.

ఆమెకు చాలా విచిత్రంగా కనపడెను "ఎందుకు?" అని ఆమె అడిగెను.

"ఎందుకంటే ఒక్క-పావులాకు తాను ఎవ్వరిని మోసుకొనివచ్చినదో గుఱ్ఱముచూస్తే మూర్ఛపోతుందండి" అని జవాబు చెప్పెను

౧౨

ఒక పట్నంలో మ్యునిసిపాలటీసభ్యులు ఒక కంట్రాక్టువిషయంలో చేసిన అవినీతికరమైన పద్ధతికి అసహ్యించుకొని, ఒక పత్రికాసంపాదకుడు వ్యాసము వ్రాసెను దానికి శీర్షికగా "మ్యునిసిపాలిటీ సభ్యులలో సగముమంది వక్రబుద్ధులు" అని పెద్దక్షరములలో వ్రాసెను.

దానిపై వ్యాజ్యము తెస్తామన్ని వానిని వారు బెదరించిరి. తనమాటలలో నిభావమును ఉపసంహరించుకొనుటకు సంపాదకుడుసమ్మతించెను. తరువాతిపత్రికలలో క్రొత్తశీర్షిక కనబడెను. అది యిట్లుండెను.

"మ్యునిసిపాలిటీ సభ్యులలో సగముమంది వక్రబుద్ధులు కారు"

౧౩

"అమ్మాయీ! నీ మొగుడిదగ్గరనుంచి ఉత్తరంవచ్చింది, నిన్ను నీఅత్తవారింటికి పంపడాని నిశ్చయించుకొన్నాను."

"అబ్బా! అమ్మను విడచిపెట్టి ఉండలేనండీ నాన్నగారూ!

ఓస్, నీకావిషయంలో చింత ఏమాత్రం వద్దు. ఆమెను నీతోకూడ తీసుకొనిపోయి ఉండవచ్చును.

౧౪

"స్వామీ! బావిలోపడ్డ నన్ను మునిగిపోకుండా బ్రతికించావు. నేను సంతోషముతో నీకు ఒక బేడా యివ్వదలచుకున్నాను. నాదగ్గర పావులాకాసు ఉన్నదే!"

"అందుకూ ఏమీపరవాలేదండి, మరొకసారి బావిలోపడండి."

౧౫

అతడు చక్కగా హోటలులో భోజనంచేసినాడు. డబ్బునియ్యవలసిన సమయంవచ్చినది. తిన్నగా అయ్యరుదగ్గరకు వెళ్లినాడు.

"అయ్యరుగారూ! నావద్ద డబ్బులు లేవండి. డబ్బులివ్వకపోతే యేంచేస్తారు" అన్నాడు.

"ఏమీ పరవాలేదండి మీపేరు అగోడమీద వ్రాసి వెళ్లండి. మళ్లీవచ్చినప్పుడు యిస్తురుగాని" అన్నాడు అయ్యరు,

"ఏమేమీ! నాపేరా? గోడమీద వ్రాయడమా? అక్కర్లే, అట్టిపిచ్చిపని నేనెన్నటికిని చేయనండి. అట్లా వ్రాసిపెట్టితే నా స్నేహితులందరూ చూచిపోరా?" అన్నాడతడు

"ఎన్నటికిని ఎవరున్నూ చూడలేరండి. చూడలేరండి. అక్షరాలను ఎవరూ చూడకుండా మీకోటు, టోపి దాన్ని కప్పివేస్తూవుంటవి." అన్నాడు అయ్యరు నిమ్మళంగా.

౧౬

ఒకడు–ఒరే! నేనుకట్టె అబద్ధాలకోరునుసుమా!
స్నేహితుడు: నేనెంతమాత్రమూ నమ్మను సుమా!

౧౭

చేపలను పట్టేవాడొకడు తన అనుభవాలను చెపుతూ, చెపుతూ "ఒరే! నేనట్టి చేపను ఎన్నడూ చూడనేదురా?" అన్నా

"నేను నీమాటలు నమ్మలేనురా" అన్నాడు స్నేహితుడు

౧౮

హైద్రాబాదు రైల్వేస్టేషనులో ఒకపెద్దమనిషి అటూఇటూచూస్తూ నిలుచుండియుండెను చివరకు ఒకరైల్వే గుమాస్తానునిలపెట్టి, "అయ్యా! హైద్రాబాదునుంచి వరంగల్లుకు ఎన్ని మైళ్లదూరం ఉన్నదండీ" అని అడిగెను.

గుమాస్తా జవాబుచెప్పి తనపనిమీద వెళ్లిపోయెను. కొంతసేపటికి మళ్లీవాడు కనబడగానే "అయ్యా! వరంగల్లునుంచి హైద్రాబాదుకు ఎన్ని మైళ్లదూరం ఉన్నదండీ" అని ఆపెద్దమనిషిఅడిగెను "ఏమయ్యో! చాలావిచిత్రంగాఉన్నదే నీప్రశ్న. ఇప్పుడేకదా హైద్రాబాదునుంచి వరంగల్లుకు ఎన్ని మైళ్లు ఉన్నదో చెప్పిఉంటిని వరంగల్లునుండి హైద్రాబాదుకు అంతేవుండక ఎంతఉంటుంది? నన్నుపిచ్చివాణ్ని చేయదలచుకొన్నవా" అనిగుమాస్తా అనెను

"అదేమిటండి అట్లాఅంటారు? భేదంఉండకూడదా? తప్పకఉంటుంది ఇదుగోచూడండి. సంవత్సరాదినుంచి శ్రీరామనవమికి ఎంతదూరం ఉన్నదో, శ్రీరామనవమినుంచి సంవత్సరాదికి అంతేదూరము ఉన్నదా?" అని పెద్దమనిషి పలికెను.

౧౯

"ఏమోయి! నీవుపెండ్లిచేసికొంటావని విం టూవున్నాను. నీకు సౌఖ్యము కలుగుగాక!"

"నేను సౌఖ్యంగా ఉండకుండుటకు కారణాలు ఏమీకనబడటంలేదు. నేనుయుద్ధరంగంనుంచి చెక్కు-చెదరకుండా వచ్చినవాడను."

౨౦

భర్త: మాఅమ్మచేసి పెడుతూఉండే కమ్మని బూరెలు తినవలెనని నాకుబుద్ధిపుట్టుతూ ఉన్నది."

భార్య: మానాయన కొనిపెడుతూఉండే మంచిమంచి చీరెలు కట్టుకోవాలని నాకు బుద్ధిపుట్టుతూ ఉన్నది."

---

